వీణ —

తెలుగు మాసపత్రిక

*

* *

సంపాదక సంఘము

శ్రీరంగం శ్రీనివాసరావు

ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి

మద్దాలి సూర్యప్రకాశరావు

సోమంచి యజ్ఞన్నశాస్త్రి

సలహా సంఘము

మల్లాది రామకృష్ణశాస్త్రి

బెజవాడ గోపాలరెడ్డి

కె. వి. పుట్టయ్య

శ్రీ [illegible] పతిరావు

* *

*

వ్యవస్థాపకులు

పాటిబండ మాధవశర్మ

గుడిపాటి రాజగోపాల



## ఆశీః

సర్వార్థి కర్ణకుహర జ్వరతాప మారా
బ్రాహ్మీయ నిక్వణ సుధారస పూరణేన
"వీణా" చకాస్తు నితరాం మహనోదయ స్త్రీ
వాగీశ్వరీ కరసరోరుహ లాలితేవ।

శివశంకర శాస్త్రి



కొంత దూరం పోయాక కళవళంతో మాయమైపోతాయి ఎక్కడో చెప్పలేము కాని తప్పకుండా మాయమై తీరుతాయి. అప్పుడు వ్యక్తిదే రాజ్యం అంతర్లోకంలోనే అతను జీవించాలి తనమీదే తన కాధారం చర్చల కిక్కడ స్థానం లేదు. రసానందం నీడలో గాలిమేడ

అందుకే చర్చలంటే నాకు పరమభయం గెలవడం ఓడిపోవడం రెండు మాటలు కాని ఒక్కటే అర్థం చర్చించి వాదం నిలబెట్టుకున్నామనీ జయించి ధ్వజం స్థాపించామని అనుకునే వాళ్లందరిని నేను చాలా అనుమానంతో చూస్తాను. వాఙ్మయాభిరుచులన్నీ కేవలం fashions నేటి fashions రేపటికి నిస్సటివై పోతాయి. సార్వకాలిక గుణాలు ఫలాని అని ఎవ్వడూ చెప్పలేడు సర్వజన రంజకత్వం మరుమరీచిక!! నువ్వు చెప్పింది నాకు నచ్చదు నేను చెప్పినది నీకునచ్చదు మనఇద్దరిలో ఎవరికి కాస్త గడుసుతనం హెచ్చో వాడు గెలుస్తాడు ఇలాగే పార్టీలు. ఇలాగే సంఘాలు. ఇలాగే దేశాలు రసంలోనూ ఇంతే మతంలోనూ ఇంతే జీవితంలోనూ ఇంతే

కాబట్టి నాకు ప్రత్యేకవ్యక్తుల పట్లనే గౌరవం ఉన్నది నాహృదయం నిష్కల్మషంగా ఉంచుకోవాలని యత్నిస్తాను ఆ హృదయంమీద ప్రతి గీతాన్ని చేస్కుకుని చూస్తాను. ఏమాత్రం స్పందనం తోచినా గౌరవిస్తాను ఇంతకంటె మరో ప్రామాణ్యం నేనంగీకరించడం నన్ను నేను మోసగించుకోవడం

వ్యక్తిత్వంతో పాటు పద్ధతికూడా కావాలి కాని పద్ధతివల్ల సైతం వ్యక్తిత్వమే ద్యోతకం కావాలి అంతవల్ల రచయిత మతం ఏదయినా నాకు పని లేదు చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి గారి కవిత్వం నా కిష్టం I hate his imitators దేవులపల్లి కృష్ణశాస్త్రి గారి కవిత్వం నాకిష్టం I scorn his followers ఒకప్పుడు కృష్ణశాస్త్రితనం అనుకరించి వ్రాసిన పద్యాలు నావి ఇప్పుడు నాకసహ్యం కలిగిస్తున్నాయి. కాని ఒకరికిరాకు శిల్పంలో స్థానం లేకపోలేదు మరొక కవిని తలపించు

తూ ఉన్నంతమాత్రంచేత ఒక పద్యం మంచిది కాకపోనక్కరలేదు. కాని స్వత్వద్యోతకమైన ప్రత్యేకత వాఙ్మయంలో అన్నిటికన్న మిన్నగా ఉపాదేయమనీ అందువల్లనే కవికి ఉన్నతశిఖరాల మీద స్థానం దొరుకుతుందనీ విస్మరించకూడదు.

మన పూర్వకవులలో తక్కువరకం వాళ్లంతా అనుకర్తలే ఇప్పటివాళ్లలో కూడా అనుకర్తలందరూ తక్కువ రకం వాళ్లే అని తెలుసుకోవడం మంచిది కవిత్వం ఒక సృష్టి అనుకోని స్థలాలనుండి అనుకోని విధాల ఇది సాక్షాత్కరిస్తుంది. జాగ్రత్త! ఇవాళ నువ్వు ఎవరూకావు. రేపు మహాకవివి!

కవిత్వానికి మనవాళ్లు కొన్ని చట్టాలు ఏర్పరిచారు. కొన్ని చట్రాలు కూడా. వీటి సహాయంవల్ల ‘ కవులు కావచ్చులెండి ’ అన్నారు ఇవి ఎలాగు ఏర్పడ్డాయో ఇవి ఎందుకు పనికిరావో చెప్పనా ?

ఉత్కృష్టమైన కళాకావ్యాలు అన్నింటికీ ఒక **Symmetry** ఉంటుంది. **Symmetry** ఉన్నవన్నీ ఉత్కృష్టరచనలు కావు. ఈ స్వల్పవిషయమే అనేక వ్యాకరణాలకూ, అనేక ఛందశ్చర్చలకూ, ( ఇంకా **Abstract** గా పోతే ) అనేకరసవివాదాలకూ కారణం. కుశాగ్రబుద్ధులైన విమర్శకులు మహాకావ్యాలను శ్రద్ధతో అధ్యయనించి సూత్రాలను, చట్టాలను ఏర్పరించారు. ఈ పనిలో ఒక సుఖం ఉందనికూడా మనం అంగీకరించాలి. కాని ఈ సూత్రాలు అశాంత శిల్పిని బంధించలేవు ఇవి ఒక కాలాన్ని కొక కాలానికి మ్రోడుపోతాయి. అప్పుడు శిల్పి వీటినన్నింటినీ నాశనం చేస్తాడు వాటి శిథిలాలనుండి ఉత్కృష్టరచన - ఇదివరకు లోకం కనివిని ఎరుగనిది - సంభూతమవుతుంది * అందువల్లనే **A work of Art can never be repeated** మరో తాజమహల్

---

* **Arthur Rimband** ఉద్దేశంలో Only those could qualify as true Poets, who could find a new world and a new language.

కట్టడంకాని, మళ్లీ శాకుంతలం వ్రాయడంకాని అసంభవం.‡

**Art for art's sake, Art for life's sake,** చివరికి **Art for my sake** ఇది చూసి లోకం ఏమనుకుంటుంది? ఈ **Art Johnnies** శిల్పం, రసం ఆనందం అని పెద్దకబుర్లు చెప్పి సంఘంమీద **parasitic** జీవనం గడుపుతున్నారని, వీళ్ళు పడే సుఖానికి మనమెందుకు డబ్బిచ్చుకోవాలి అని. కష్టార్జితమైన డబ్బు కదా మరి?—

కాని నిజమయిన శిల్పి అనిర్వాచ్యమున్నూ, అనుభవైకవేద్యమున్నూ అయిన ఆనందాన్ని పొందుతున్నాడు. మన **Babbitts** కూడా ఒక్కొక్కప్పుడు పంచిపెట్టగలుగుతున్నాడు ఎంత మర్యాదస్థులైనా సంఘం అంగీకరించిన పెద్ద కళాకారుల దగ్గరమాత్రం ఒదిగి ఉండి మిగిలిన శిల్పాన్ని పైకికాకపోతే మనస్సులోనైనా తిట్టుకుంటూ ఉంటారు. వీళ్ళలో చాలామంది దొంగతనంగా పది **Johnny Walker** సీసాలకు డబ్బు జల్లుతారు గాని ఒక సాహిత్య పత్రికకు చందా యివ్వడం వ్యర్థకృత్యమని భావిస్తారు.

స్థూలదృష్టిని చూస్తే ఇది కవిత్వానికి కాలంకాదు కాబోలుననిపించుతున్నది. లోకాన్నే ఒక నిస్పృహా నిస్త్రాణ ఆవరించాయి. కవులు వడగొట్టుకొని పోతున్న ఈ కాలంలో కవిత్వం గాలిలోనే హరించుకుపోతున్నది. పరిస్థితులప్రాతికూల్యం- ఇది పరిమాణభేదంతో ఎప్పుడూ ఉంటున్నదే!- ఈ స్థితికి కారణభూతం అంటారు నిజమేమో! ఏం రోజులివి? ఎంగిలాకు పత్రికలూ, ఏనాంపెళ్లిళ్లూ, కుక్కగొడుగు పార్టీలూ, దాలిగుంట బ్రతుకులూ, ఎటు చూసినా లక్కపిడత మనుష్యులూ,

‡ **Change of medium** వల్ల కొన్నింటిని **re-create** చెయ్యవచ్చును. **Mid-summer Night's Dream** నాటకాన్ని **film** చేసి **Max Reinhardt** ఇది సాధించాడు రెండో రకపు నవల **Dr Jekyll and Mr Hyde** ను **Rouben Mamoulien** అద్భుతమైన టాకీ చేశాడు.

క్రవ్యపిండలం మాంసస్సులూ! పత్రికలన్నీ నీరసం. మనుష్యులందరూ గుల్లసరుకు అంతా దగా ఎవరిదీ రాజ్యం? కత్తిది!— Cannon ది!— Poison Gas ది!— కళ్ళు మూసుకుంటు నెత్తురథచక్రాలు పోతాయి మనమీదనుండి

ఈ అల్లకల్లోలంలో కవీ! ఎవరు వింటారు నీ పద్యాలు? 1914 జ్ఞాపకమున్నదీ? దేశదేశాలనుంచి నువ్వు కలం వదలి కవచం ధరించి బయలుదేరావు War to end War అనే కేకలు నిజమే అనుకున్నావు లోకానికి శాంతి నిచ్చే రోజులు, ధర్మం స్థాపించే రోజులు, లోకానికి స్వర్ణయుగం సంపాదించడానికి కదలి పోయావు. యువకవి! ఇప్పుడు నువ్వెక్కడ? నీ భూతం మమ్మల్ని శపించుతున్నది మేము మళ్ళీ వెనకటికివచ్చాం. భయంకర కాలమేఘాల చీకటి నేడు యువకవీ? ఎక్కడ నువ్వు? నీ అగత్యం వచ్చింది మాకు. నువ్వే దిగులుపడితే వెనకదీస్తే మాకు దారేమిటి?

నిజంగా ప్రపంచానికి కవిత్వమే కావలిస్తే ఇంతకంటే అనువు లేదు. సాహసీ! నీసందేశం కోసం విశ్వం తన చాతకవదనం తెరచుకున్నది నీ గానానికి మా వీణాతంత్రుల శ్రుతి సవరిస్తున్నాము తలుపులన్నీ వివృతం చేసి ఉంచాము. నువ్వు రావాలి. రావాలి ఆరోహణావరోహణాలతో మంద్రం నుండి తారం దాకా ఉద్రేకఝంఝ, ఉత్సాహశంప ఉలుకెత్తించి ఉద్ఘాతలూగించి జీవితాన్ని నక్షత్రగోళాలరాగమాలా — ఆలాపనలతో హోరెత్తించుతావో, విశ్వకటాహంలో వ్రేగిపోతున్న కోటికోటిమానవుల ఘోటుఘోటుమని కొట్టుకునే విహ్వలత్వం, బాధలూ, విభ్రమత్వం, వ్యాధులూ, సకలవికలమనోవస్థలనూ sublimate చేసి స్ఫటీకరణ చేస్తావో, నువ్వు ఎప్పుడు వస్తావో, ఎలాగు వస్తావో! నువ్వు Cyclone లాగో, Sulphuric acid లాగో గంధసింధురంలాగో గండభేరుండంలాగో రావోయ్! రావోయ్! యువకవీ!! నవకవీ!!!

శ్రీ శ్రీ.

" పరభణితిపరీక్షా యుజ్యతే సజ్జనానామ్ "

ఉదారబుద్ధితో ఒకరి రచనావిశేషములను చర్చించి గుణదోష విచారణ చెయ్యడానికి ప్రతి సహృదయునకూ హక్కు ఉంది.

బహుముఖాల విస్తరిల్లే సాహిత్య ప్రవాహములకు ఆనకట్టలు కట్టి భావుకహృదయ క్షేత్రములను రసప్లావితములు చేసే మహాకార్యం విమర్శ

ద్విజేంద్రుని ' కాళిదాస - భవభూతులు ' టాగోరు ' మేఘసందేశ విమర్శ ' అరబిందుని ' వాల్మీకి – కాళిదాస విమర్శ ' చదివిచూస్తే కవి దివ్యదృష్టిసరిహద్దుల ముట్టి విమర్శకుని ఇంద్రజాలపింఛిక కవి కావ్యమునుండి ఎన్నియెన్ని సౌందర్యలోకములను భావరత్నములను పుట్టించి సహృదయుల్ని సంభ్రమాశ్చర్యముల ముంచివేస్తుందో తెలుసుకోవచ్చు.

కవిత్వము రత్నమైతే విమర్శ శాణం. కవిత్వాన్ని కన్యక అంటే విమర్శ ఆమె అవయవములమీద మెదిలే లావణ్యం.

ఇది పరమార్థము ఈ దృష్టితో విమర్శ చేసేవారుగాని, విమర్శ చూసేవారుగాని తెలుగునాట చాలా అరుదుగా ఉన్నారు.

ఇంచుమించు తెలుగువారి పరిభాషలో విమర్శ అంటే దెబ్బకొట్టడం ఏకి వెయ్యడమున్నూ.

అసలు ఈమాట సంస్కృతంలో ' వి ' పూర్వక ' మృశ్ ' ధాతువు నుండి పుట్టి బాగుగా స్పృశించడం, బాగుగా ఆలోచించడం అనే అర్థంతో వ్యవహారానికి వచ్చింది.

సంస్కృత విమర్శలు శాస్త్రచర్చలయందూ సాహిత్య మీమాంసల యందూ ఎంతో ఉన్నతములై మనకు ఎన్నోరీతుల దారిచూపినవి—

కాని

వ్యక్తిగతరాగద్వేషాలతో తమ విమర్శనాప్రతిభను దుర్వ్యయంచేసిన

'మనోరమాకుచమర్దన' కారాదులు, 'రసగంగాధర' కారాదులు విమర్శలో మనను ఎన్నో విధాల తప్పు దారులకు నెట్టాయి. వెనుక వారు కొందరు ఈర్ష్యాసూయలకు పాలై, పరభణితిపరీక్షలో ఒయికు పుల్లదపమునకు పాల్పడ్డారు.

ప్రస్తుతస్థితి ననుసరించి ఆంధ్రవిమర్శ మూడు విధాలు

౧ దోషైకదృక్కుతో పరరచనలను దూషించడం, రా గ్ధాన్వేషణం ఉదా వేదంవారి కొన్ని శారదాకాంచికలు, గ్రామ్యశాస్త్రులుగారి రచనలు కొన్ని.

౨ మొహమాటాలు చెడకుండా అన్నిగ్రంథాలూ బాగున్నవని 'ప్రతానాముత్తమం వ్రతం' పాలించడం, రచయితకు ఆయురారోగ్యాలు ఇవ్వమని భగవంతుడికి సిఫారసు చెయ్యడం ఉదా భారతి, గృహలక్ష్మి రివ్యూలు.

3 న్యాయ్యదృష్టితో రచయితయొక్కయు, రచనయొక్కయు, ఎవారిని గమనించి గుణదోషప్రాబల్యము ననుసరించి అందలి అంతర్విశేషములనూ, అందచందములనూ వివరించడం

మన వాఙ్మయం ఉన్నతికి రావాలంటే, సహృదయసేవ్యం కావాలంటే, పై మూడవతెగ విమర్శ మనకు కావాలి — కావాలి

సామాన్యమైన విమర్శ అనే మాటను విడిచి సద్విమర్శ 'ఎపిగాకి' అనే కొత్తమాట మేము వాడుతున్నాము

సారస్వతపికమునకు ఎదురుగా నిలువబడి కేవలసాహిత్యాభ్యుదయానికి శ్రేయస్సునకు వ్యక్తిగతరాగద్వేషాల విడచి సమీక్ష చేయుటలు చుకున్నాము.

మా ఆదర్శమందు ఏమాత్రం పరమార్థం ఉన్నా, సహృదయ సుహృదులు హృదయపూర్వకసహకారం చూపుతారని విశ్వసిస్తున్నాము.

క చ శ

మా వీణలో కథాతంత్రిని ప్రత్యేకంగా పలికిస్తున్నాము. కాబట్టి దా నిని గురించి యేవో మూడుముక్కలు చెప్పదలుచుకున్నా.

కథ అంటేనే చెప్పడం అయినప్పటికీ యీ అర్థం యీ రోజులలో పూర్తిగా మారిపోయి వ్రాయడం అనే అర్థంలోకి వచ్చింది ఎవ్వ రైనా నానను "నీవు కథలు వ్రాయగలవా?" అని అడుగుతున్నారుగాని చెప్పగలవా? అని అడగడంలేదు ఈ యుగంలో వచ్చిన మార్పుల లో యిది వకటి

కథలు చెప్పడంగాని వ్రాయడంగాని యెందుకూ? వీటివల్ల మనంపొందే ప్రయోజనంయేమిటి? అని మనకు సహజంగా ప్రశ్నలు స్ఫురిస్తాయి. కథలు వినడంవల్ల మనస్సు ఒక విధమయిన ఆనందం పొందుతుంది కాబట్టే కథలకు ఇంత ప్రచారంకలిగింది. కనుక మనం వ్రాసే-చదివే కథలలో ఆనందము కలిగించే గుణము అవశ్యం వుండాలి మనం యేదయినా వక కథను చదివినప్పుడు మనమనస్సుకు ఆనందం కలగడానికిబదులు విసుగుదల పుట్టించినట్లయితే అది చేస్పుతో వ్రా సినది కాదని చెప్పవచ్చును.

కథలనుంచి మనం పొందే ప్రయోజనము మనోరంజనమేనా? ఇంకా యేమయినా ఉంటుందా? అని ప్రశ్నించవచ్చును. మానవుడి మేధా శక్తి వికసించనంతవరకు ఆతను కథలలో వుండే మనోరంజకత్వము తోనే సంతుష్టి చెందేవాడు. అటువంటివారికి పేదరాసి పెద్దమ్మ కథలు అంటే చాలా యిష్టము అందుకుమించి వారు కథలలో విశేషవిషయ ములను కోరరు కాని మానవుడి మనస్సు వికసించినకొలది శిక్షవలన అనుభవమువలన జ్ఞానము అభివృద్ధి యయినకొలది ఆతను కథలలో నుంచి కేవలము మనోరంజనమే కాకుండా ఇంకా ఇతర ప్రయోజన ములను అన్వేషించుతాడు. కథ అంతా విని యీ విధంగా కథ చెప్ప డానికి కారణమేమిటని ప్రశ్నించుకుంటాడు. అందులో నీతి, ధర్మమూ

వుంటే చాలాబాగుండేదని సలహా యిస్తాను.

కథకుడు సరియైన నేర్పు గలవాడయితే తనకథవల్ల అజ్ఞానినీ విజ్ఞానినీ గూడా సమంగానే రంజింప చేయవచ్చును. సాధారణప్రజ్ఞావంతుడు కథావస్తువును అందలి చమత్కారమును చూసి సంతోషపడతాడు. విశేషజ్ఞుడు కథయందు యిమిడియున్న నిగూఢతత్వాన్ని అన్వేషించి సఫలీకృత మనోరథుడౌతాడు. ఆవిధంగా అందరిని సంతోషపెట్టలేని కథవుంటే అందులో యేదో లోపమున్నదని నిస్సంశయంగా చెప్ప వచ్చును.

స్త్రీపురుషుల లౌల్యమును గురించి వ్రాయునప్పుడు కేవలము వ్యభి చార వర్ణనమే పరమార్థంగా పెట్టుకోరాదు. అది అధమజాతి కథ కులపని. కథకుడు ప్రతిభకలవాడయితే తనకథలోని పాత్రల స్వభా వాన్నీ మానసిక ఆందోళనాన్ని చిత్రిస్తూ జీవితపరిణామాన్ని సుక మంగా నిరూపించాలి. అప్పుడే అటువంటి కథలు పఠితలమనస్సును ఆలోచింపచేటట్లు చేస్తాయి.

సారాంశమిది. కథలను వ్రాయునప్పుడు యేదోవక ప్రయోజనాన్ని ఉద్దేశించి వ్రాయాలిగాని ఊబుసుపోకకు వ్రాయరాదు ప్రపంచ రంగంలో జరిగే ఘటనలను కథలలోనికి ఎక్కించేటప్పుడు న్యూస్ రిపోర్టర్లవలె ఘటనమాత్రమే వర్ణించకుండా మనస్తత్వశాస్త్రజ్ఞుని వలె పాత్రలమనస్సును పఠితలకు ప్రదర్శించాలి. కథయొక్క మొట్ట మొదటి ప్రయోజనం పఠితలమనస్సు రంజింపచెయ్యడమే రెండవది జీవితంలోనిలోపాల్ని యెత్తిచూపించి వాటిని సంస్కరించుటకు అను వయిన మార్గాన్ని సూచించడం. ఈరెండువిషయాలూ కథలయందు వున్నప్పుడే కథలకు మౌలికత్వమమరి నూతనత్వం సిద్ధిస్తుంది.

రాజగోపాల్

* * * *

ప్రకృతి యీనాడు మానవుడిలో ఒక అద్భుతశక్తిని జాగృతంచేసింది. ప్రపంచనాగరికతా నిర్మాణానికై ఈశక్తి తహతహలాడి పోతోంది. భౌతికములైన దేశకాలసంకేతాలను రూపుమాపే పరోక్షశక్తులనేకం ప్రవర్తిస్తున్నవి. విరుద్ధభావాల క్షణికత్వం వీటి అంతస్తత్వం. భిన్నభిన్న విజ్ఞానాలు తత్వతః సమానాలే అనే సత్యం స్పష్టంగా ప్రత్యక్షమవుతోంది.

ప్రపంచనాగరికత ప్రపంచకళాస్వరూపాన్ని స్ఫురింపజేస్తుంది. కళ నాగరికతయొక్క ప్రధానాంశ గనుక. చిత్రకళ కూడా ఈప్రపంచపరిణామాన్ని అనుసరిస్తూనే వున్నది.

మధ్యయుగాల చిత్రకళకు స్థానికత ఒక చిత్రమైన ప్రధాన లక్షణం. ఆ కళయొక్క ఉత్తమలక్షణా లెలా వున్నా, కాలానుసృతిని అది ఉత్కృష్టకళాసృష్టికి నిరోధకమైన ఒక సంకుచితత్వాన్ని, ఉదాసీనతను ప్రదర్శించింది. దీనికితోడు విజాతీయ కళాస్వాదనానికి, విశాలశాస్త్రీయదృష్టికి ప్రతిబంధకమైన ఒక నైజ్ఞానికదురభిమానం కూడా ఆ కాలంలో ప్రబలి వుండేవి.

కాని ఈనాడు భౌతికమైన స్థలభేదం నశించడంతో టోకియో, పెకింగు, అజంతా, వెటికన్, లాప్రే, మున్నగు భిన్నప్రాంతముల కళలన్నీ మనకు సన్నిహితాలైనవి భూగర్భశాస్త్రాభివృద్ధివల్ల ప్రాచీనుల కళావిలసనాలన్నీ మనకు ప్రత్యక్షమవుతున్నవి. విమర్శలో చారిత్రకదృష్టి హెచ్చడంవల్ల మన కళాజడత్వం వదలి నానాజాతుల కళాస్వరూపం మనకు అనుభవానికివస్తోంది.

విజ్ఞాననిధియగు నేటి కళారాధకుడు, జపాన్,చైనా,ఇండియా మున్నగు దేశముల చిత్రకళ అనాగరికము శోభారహితము కాదని గుర్తించాడు. గ్రీసు, ఫ్రాన్సు, ఇగ్లండు దేశముల చిత్రకళ కేవలము ఐహికము, వైషయికముమాత్రమే కాదని అతడు ఎరుగును. అతనిదృష్టిలో ఇదిప్రాచ్య

ము ఇది పాశ్చాత్యము అను భేదము నశించినది. మానవజాతిని ఉద్ధరించి ఉజ్వలము చేయగల మహాశక్తిని రెండిటి యందును అతడు కనిపెట్టినాడు. ఆ రెండు తరగతుల కళయొక్కయు సౌందర్యమును ఆర్ద్ర దృష్టితో పరిశీలించి అనుభవించుట అతనికి అగత్యమైనది.

నేటి లలితకళా ప్రదర్శనములు సర్వప్రపంచమునకు సంబంధించినవి. వందజాతుల కళాస్వరూపమునుండి నేటి కళోపాసిత తన కనురూపము అభిమతము అయిన చిత్రమును వరించవలసివున్నది.

తన ప్రతిభపై వాని ప్రభావము సోకినప్పుడు అతడు విభ్రాంతుడు కాకతప్పదు

దీని కంతటికీ ఫలిత మేమంటే దేశము, కాలము, జాతి, ఆచారము, కులము, వర్ణము నిమిత్తం లేని ఒక అపరూపకళాస్వరూపము క్రమక్రమంగా వ్యక్తం కాబోతోంది.

మ. సూ. ప్ర.

* * * *

అనేకకారణాలవల్ల ఒక జాతి చైతన్యం తాత్కాలికంగా నిద్రాణము కావచ్చు. కాని యుగయుగాల నిద్రాణమైన ఈ చైతన్యాన్ని పునః ప్రబోధితం చెయ్యాడానికి విప్లవాలు సంభవిస్తున్నవి. వీటివలన జాతి యొక్క సనాతనమయిన ధర్మం నిశితమై శక్తిమంతమవుతోంది.

బహుముఖమైన జాతి జీవితంలో ధర్మగ్లాని కలిగినప్పుడు ధర్మసంస్థాపనార్థం ఒక మహాపురుషుడు, లేక కొందరు మహాపురుషులు ఉద్భవించి భ్రంశోన్ముఖమయిన జాతి ధర్మాన్ని పునరుద్ధరిస్తూ వుంటారు. ఈ యిరవయ్యో శతాబ్దిలో ముఖ్యంగా ఐరోపామహాసంగ్రామానంతరం సర్వప్రపంచముయొక్క దృక్పథంలోనూ చిత్రమైన పరిణామం జరిగింది. మానవజీవితం ప్రతీ శాఖలోనూ అనివార్యాలయిన విప్లవములు కలిగినవి. వ్యక్తిస్వాతంత్ర్యవాదమూ, ప్రజాపరిపాలనాభావా

లూ, ప్రపంచమంతటా అల్లుకుపోయినవి. పూర్వయుగాల్లో ఎన్నడు న్నూ లేని అనేక క్లిష్టసమస్యలూ, పరిస్థితులూ, అధునికుల్ని ఎదు ర్కొంటున్నవి. తరతరాలుగా వస్తున్న ఆచారసౌధాలు కూలిపోతూ వున్నవి. వాటి స్థానే నూతనసౌధనిర్మాణయత్నాలు జరుగుతున్నవి. భవితవ్యమెలా వుందో నిశ్చయంలేదు. పరిస్థితులు క్షణక్షణానికీ మారి పోతున్నవి. ఆసేతుశీతాచల మయిన ప్రపంచము అనంతవిశ్వముగా మారడంతో భారతీయవిజ్ఞానం ప్రపంచవిజ్ఞాన మయిపోయింది. ఖం డాంతరాలకూ మతాంతరాలకూ సంఘర్షణ సంభవించినది. మహాస ముద్రాలనూ మహాపర్వతాలనూదాటి భారతీయనాగరకత ఖండాం తరనాగరకతలతో కరస్పర్శ గావిస్తోంది. ప్రత్యేకవిజ్ఞానాలూ, నాగర కతలూ నశిస్తున్నవి. కాని యింకా ప్రపంచానికి ఏకైకమగు నాగర కత రూపుకట్టలేదు.

జీవితాకాశాన్ని చీల్చుకవచ్చే మెరుపు కవిత్వం. దీనిలో తత్కాలజీవి తం ఎలా వుంటే అలా ప్రతిఫలిస్తుంది. సంక్షుభితమూ, అవ్యవస్థమూ అయిన నేటి జీవితమే నేటి కవిత్వంలో ప్రతిఫలిస్తోంది.

హిమాలయమ్ములు
గుహాముఖమ్ముల
తెలియని యేదో
ప్రళయరావములు ధ్వనించి
దద్దరిల్లెను!
భగీరథాత్మజ
సభంగతనువై
ఏదో తన తడి—
ఇగురబెట్టు నెండ కొట్టి
ఆవటిల్లెను!

ధరిత్రియంతయు
నదో కలతవడి
తన మనస్సు త్రోవలు—
రహదార్లు లేక
గుసుసు వడియెను!
ఏది చూచినా
తుపానులో
విరిగి పోవుచున్న —
కెరటముపై ఓడవలె
అటో ఇటో అన్నట్లున్నది!

చిరంతనమయిన హిమాలయం దద్దరిల్లిపోతోంది, అనంతజలమయి యిన భగీరథాత్మజ ఆవటిల్లిపోతోంది, ధరిత్రి అంతా తన నడవడికలో

రహదార్లులేక గుడుసువడిపోతోంది. ఆధునికప్రపంచవిప్లవానికి చిరంతనమైన ప్రకృతి అంతా తల్లడిల్లిపోతోంది. భవిష్యత్తు ...?—

ఈ సంక్షోభం, అశాంతి, విప్లవం, తహతహా నవీనుల కళాస్వరూపాలలో ప్రత్యక్షమవుతున్నవి. కవులు ఇంతవరకు సాధించిన మహార్థము ఏమీ లేకపోయినా పూర్వమెన్నడూ ఈ జాతి యెరుగని ఒక చైతన్యము, ఉత్సాహము, ఉద్రేకము కవులను ఆవేశించినవి. ఈ మహాశక్తులు వృథా పోవు.

నవయుగప్రళయం ఒక నూతన ప్రపంచ సృష్టికి దారి చూపుతున్నది. ఉష్ణరక్తం పొంగే యువకవు లీయంశాన్ని గుర్తించారు.

యముని మహిషపు లోహఘంటలు
మబ్బుచాటున
ఖణేల్ మన్నాయి!

... ... ... ...

పుడమితల్లికి పురిటి నొప్పులు
క్రొత్త సృష్టిని
తెలియ జేశాయి.

ఈ నాటి సంక్షోభం మానవజాతికి సరిక్రొత్త. కొన్ని శతాబ్దులుగా ఈ జాతినుంచి చైతన్యం తరలిపోయింది. నేటికి తిరిగీ ఉజ్జీవితమైన ఆ చైతన్యప్రభ నూతనదేహాన్ని కోరుతోంది. ఇరవయ్యైను ఏళ్ళక్రితమే

మంచి గతమున కొంచెమేనోయ్!

అని మహాకవి శంఖం పూరించాడు. దాంతో కవులు పురోగమనము సాగించారు. భూతభవిష్యాల ప్రసక్తి లేదు

నడచుచుందును ముందునకు నే
నడచుచుందు నిరంతరంబును
ముందువెన్కలగూర్చి చింతన
డెందమున లేదు.

వెనక చూస్తే శూన్యం, ముందు చూస్తే నిరాశ. భవిష్యత్తు కభిముఖులై కవులు వర్తమానాన్నే ఆరాధించారు.

ఇంతలో పరిస్థితులు మారినవి. కొంచెం కలతదేరినా ప్రపంచం వైవిధ్యాన్నే ఆశ్రయించింది. భవిష్యత్తునుగూర్చి ఏవో అస్పష్టాలైన ఆశలు బయలుదేరాయి.

యుద్ధసంరంభములో క్షోభలో కలగిపోయిన జనానికి శాంతిస్వప్నాలు వచ్చాయి. "స్యందనాసీనయగు దేవి శాంతి శాంతి" అంటూ కవుల కలలలోకి వచ్చింది. ఇదంతా మిధ్య, ఛాయ!—
అంతటి మహాసంగ్రామమూ జనానికి క్రొత్త ప్రపంచాన్ని సృష్టించలేక పోయింది. తత్కాలాని కనుగుణంగా ప్రపంచమంతా భిన్నభిన్న రీతుల సర్దుకుంది. కాని ఆ స్థితి ఎంతో కాలం ఉండ నోచుకో లేదు. ప్రపంచమంతా ఏకముఖం ఐతీరాలి! మళ్ళీ ఒక సంక్షోభం అవసరం. ఈ సారి ప్రపంచం పునుగూ పేకా కదలబారి పోవాలి. తిరిగీ నేల గట్టిబడేసరికి క్రొత్త సృష్టి విస్తరిల్లివుండాలి. ఆ నూతన ప్రపంచాన్ని నవకవుల్లో యువకవులు పసికడుతూనే వున్నారు. సన్నిహిత భవిష్యత్తులో లోకానికి సంక్షోభాన్నే యువకవి విధిస్తున్నాడు. తథాస్తు! ఆ సంక్షోభానంతరమే రామిరెడ్డిగారు కలగన్న శాంతిదేవత మంజులగానం చేస్తుంది, బక్కనేల బంగరుంబంట పండుతుంది, నవ్యసత్క్షత్రవీణాస్వనాల్లో శాంతిగానం వినవస్తుంది.

ఆంధ్రదేశంలో నేడు రసికులారాధించదగ్గ కళాస్వరూపం లేనేలేదని దబ్బరలాడే మిధ్యావాదుల మాటలు లెక్కచెయ్యక సహృదయులు రసపిపాసతో ఆర్ద్రబుద్ధితో నవీనుల కళాసృష్టిని తిలకించాలి.

కళాస్వాదనానికి సానుభూతి ప్రధానసాధనం. ఇతరుల ప్రేమ, విషాదం ఆనందం, ఉద్వేగం, మొదలయిన భావాలతో తాదాత్మ్యం పొందగల సాత్త్విక - ఆర్ద్రహృదయం లేనిదే కళ అనుభవానికిరాదు. సాను

భూరి ఎప్పుడూ సాత్వికం. లయాత్మకమయిన శబ్దరచనలో లోకుల సుఖదుఃఖాల్ని అనుభవించడమే కవిత్వం. అనంత విశ్వాన్ని మానవ హృదయంలో దీపింపజేసే కళాస్వాదనానికి పఠితలో సుకుమారమైన అంతఃకరణ వుండాలి.

అంతర్వాహినియైన సరస్వతీమహానది పన్నెండు సంవత్సరాల కొక్కసారి మహాపుష్కర సమయంలో పుణ్యశీలురైన భక్తులకు గంగాయమునాసంగమస్థలంలో పీతవర్ణంతో సాక్షాత్కరిస్తుందట! ఆ పవిత్రముహూర్తాన ఆమె జలంలో స్నానం చేసినవారు తరిస్తారట! కవిత్వము కూడా ఈ సరస్వతీనది వంటిదే. కవిత్వానికి కూడా పర్వకాలాలు ఉంటవి. క్షీణయుగంలో అంతర్వాహిని ఐపోయిన ఆంధ్ర కవితా సరస్వతి ఈనాడు తిరిగి ప్రత్యక్షమూర్తి అయింది. ఈ పర్వకాలంలో నిర్మలాంతఃకరణంతో దీనిలో ఓలలాడగల భావుకులు సమకాల ప్రపంచానికి ప్రాణభూతమైన ఈ మహా చైతన్యాన్ని అనుభవించి ఆనందమూర్తులై తేస్తారు!

ప్రకృతి కళను అనుకరిస్తుందని ఒకమహాశయుడు అన్నాడు. సర్వాంగ సుందరమైన ప్రపంచం కళలో ముందు పుట్టాలి. భూతకాలాన్ని చూసి ఆవేశంపొంది భవిష్యత్తులో ఆశలుకట్టుకుంటూ వర్తమానాన్ని మధురం, సర్వసుందరం, ఆనందమయంగా చేసుకోగల జాతి మనకు కావాలి. విశ్వప్రపంచాన్ని, విశ్వజీవితాన్ని, విశ్వవిజ్ఞానాన్ని ఏకముఖంగా, ఏకరూపంగా, ఏకదృష్టితో పరమాత్మ చిద్వికారంగా దర్శించి ఆరాధించగల యువకులు కావాలి.

వీణాతంత్రులను సవరిస్తూ, స్వరపరిణామాల్ని నిరూపించడానికి ఆంధ్రయువకులనుండి మెరికలవంటి పండితులు వీణకు సంపాదకవర్గంగా ఏర్పడ్డారు. ఈ యువకులు వీణాగానంలో విశ్వహృదయస్పందనాన్ని వినిపిస్తారని నమ్మిక. వీణ ఆంధ్రులను తనించగలదు.

పా. మా. శ.

# To A. C. S.

విషం గ్రక్కే భుజంగాలో,
కదం త్రొక్కే తురంగాలో,
మదం పట్టిన మాతంగాలో
కవీ! నీ పాటల్.

వలయవిచలద్విహంగాలో,
విలయసాగరతరంగాలో,
యుద్ధగుంజన్మృదంగాలో
కవీ! నీ పాటల్.

షెల్లీ కవనపు హల్లీసకమూ,
ఫ్రెంచి గీతుల మంచి రీతులు,
మోహినీగంధర్వగానం
కవీ! నీ పాటల్.

ఎర్ర కాంతుల ఇనోదయమూ,
రెక్క విప్పిన రివల్యూషన్,
కడలి వలపూ, వలపు కడలీ
కవీ! నీ పాటల్.

కవీ! నీ గళగళన్మంగళ
కళాకాహళహళాహళిలో
కలసిపోతిని, కరగిపోతిని,
కానరాకే కదలిపోతిని!

శ్రీరంగం శ్రీనివాసరావు

# గీతిక

నదినిండ నీరున్నదీ - నావపై పిల్లున్నదీ,
పిల్లాకు వొళ్ళున్నదీ - వొళ్ళెల్ల వయసున్నదీ,
ఏటికి మేటెక్కడా? - గోటికి దాటైన చాల్

చిన్నాది పూదేనెరా - కవటాకులో ఈనెరా
పున్నామి నెలబరణిరా - మొమ్మొదట నా రాణిరా
నీతోటి ఏమన్నదీ? - నాతోటి రమ్మన్నదీ:

మాటంటె బోటోనిదీ - అఁకుంటె గోటోనిదీ
గొంతుకలో పాటున్నదీ - అంతాట ప్రజ్ఞున్నదీ
ఎంతసూ సిగ్గంటునే - వింతసూ మొగుతుంటదీ.

చీకట్లో కేకెడతదీ - కేకెడుతు కిందడతదీ
ఏకాడ తడుమూవురా? - ఆకన్నె అతిలేతరా
పీకాను కాలేతునో? - పయ్యంట చెయ్యంతునో?

ప్రేమాడి ప్రాణాముగా - మానామె డానాడిగా
ఊపిరి ముందాడెరా - ఆపైని చూపాడెరా
ఓపాటి స్త్రీగాపరా - నాపట్ల అతిసాధురా

కళ్ళల్లో ముద్దెట్టుతూ — తెల్లాఅ నీనంటదీ
తెల్లాటి పోతూంటె తా — సెల్లాగొ ఇయిపోతదీ
ఒక్కళ్ల సైయున్నచూ — చక్కాతా నలుసౌతవే

ఊదేస్తె గాలౌతదీ — రోదిస్తె నభమౌతదీ
దరిలేస్తె నీరౌతదీ — బఁగీస్తె ధరణౌతదీ
పొగకట్టి కగ్గౌతదీ — ఇగనాకు దాకేదిరా?

మాయిద్దతీ మధ్యచూ — బాలార్కు డుదయించుటా?
బాలార్కు డుదయించి తా - మార్తాండుడై మండుటా?
ఏనాటి వెలుగోపలేం — ఆపక్క నీడోపలేం

పులితోకవలె వియత్తలవనిం దోచె మ
నోజ్ఞమై యింద్రధనుస్సు ముక్క
పుడమిపడంతి కాన్పునకుఁ దాంబూలమ్ము
కొఱకుఁ గాదుగ వచ్చెఁ గుక్కగొడుగు
మొ సి పందిరిగుంజ మొదటఁ బట్టినది చి
క్కగఁ గన్నె లెదఁ బొంగఁ గాకిబొడ్డు
పొల్లు చిక్కను బీరమొక్కలాకుచివళ్ళ
బారాడె నింద్రగోపవ్రజంబు
కంతకంతకుఁ జేతికి నందునట్లు
బావిలో నీరు బిల్లున బైకి వచ్చె
నీ నవాంభోద ఋతువు మరేమొ బాల
హృదయములకు నానంద మందిచ్చునట్లు

పసపు కుంకుముల శోభ వెలార్చెఁ గ్రొంబూలఁ
బ్రాతపూవుల గంగరావిచెట్టు
తగఁ బూలు విరిచిన తొగరువీర పసందు
నుంబోలెఁ బూచిన నువ్వుచేను
లేఁబసవాకు లాలీషవార్షుకబింకు
లిలకుఁ బచ్చని బలాకలుగఁ దోచె
పాలుపెక్కు వరి కాజపువ్వులోఁ గిలకిల
సోలు సౌదామనివోలె నవ్వె
గోలు రాని పోసింబోసు కొడుపులందు
క్రొత్త తెంగడు మొక్కల కోట కట్టు
కొన్ని వల్మీకములఁ ద్రామకొదము లొదిగ
ఈ నవాంభోదమాలావిజృంభణమున.

ఏ పడాం బనుభవింగనేరక యొడ్డి
గిలఁ బడెఁ జిన్ని కాగితపుఁ బడవ
తాళ్ళతోపులఁ జూలుతేన్ప కడుపుడిప్పు
తెరచి పిల్లలనుమతింపబడియె

## వర్షర్తువు

శ్వాసృగాలములకు వానవల్లప్పులో
నెండవానలఁ బెండ్లి యేరుపడియె
చూడిగేదెకుఁ బెయ్యదూడయే పుట్టునో
దున్నపిల్లయొ చెప్పఁ దుంగకాడ
నావికులు, ప్రకృత్యర్థనిర్ణాయకులు, సు
కేళినిధులు, జోస్యులు, తెల్గుబాలకులు ప్ర
కాశమందిరి వాసలోకాలనుండి
వచ్చి నడయాడుచున్న దేవతలవోలె

ప్రాయినిప్పుసెగ తడిపొడిగ నారిన చాలి
చాలని యంగవస్త్రంబు కట్టి
తడియారమిని నల్లవడినగ్నికుండ వి
భూతిక మై మొగమ్ముగ ధరించి
వాన యొద్దశఁ బ్రత్యవాయభీతి సమగ్ర
చేతఃపదముగ రక్షించుకొనియు
అడుగున విస్ఫులింగాకృతి నున్న పూ
డ కన్నులఁ జేయి యడ్డమిడి యూది
జ్వాల సేయుతఱికిఁ జచ్చిచేయంగల
విన్నపంబులయ్యు విహితకర్మ
సాగుబోవనీడు సోమాప్తపైడి కీ
ఋతువశంగ నికషదృషదమట్లు

వెన్నఁ గొట్టినవారి వెస తాఁ గొట్టును
న్నట్లు మేఘుడు హేళి కడ్డువచ్చె
మున్నువచ్చు చెవులకన్నఁ గొమ్ములు వాడి
యన వరికిని గలుషధికమయ్యె
మొఱిగిన కుక్క తాఁ గరవదన్నట్లు గ
ర్జించిన మొగిలు వర్షించకుండె
దివము మంచిదటంచు పవలె దొంగిలినట్లు
కాలిబాటలఁ గూడ గడ్డి మొలచె

తడిసి మరికాని గుడిసె కట్టకును త్రాగి
గాని మొగ్గదన్నట్లు ముఱ కాంత పుట్టి
నింటి తబ యెల్లయును లాగి యిప్పుడినుకు
ముగుద తమ్మి కన్నపుటకే మొగమువాచె.

మొగలు వైఖరి శిల్పపుంబొమ్మల సైగ
దువ్వుకొన్నవి తాటితోపు తలలు
మ్రుగ్గులు పెట్టె పారుదల నీటికిని గో
ల్తలచన్న చిఱుపోటు తరగలగమి
మోరలు వంచి చిమ్మనఁ దోక లెగనెత్తి
యూకనిబాడె లేదూడ కదుపు
మహిషదితిప్రసూ మర్దనప్రస్థాన
కుపిత దుర్గయునా మొగల్ చెలంగె
బాటఁ జను పాంథుడుచు ద్రోపువడియుఁ దూలె
నల్పజంతువుల్ భయపడి యరచి పరచె
ఒక్క పడఁ బోసికొను వానదిక్కునుండి
కదలి పాతాళవాయు వొక్కంకు వచ్చి.

కోపచండము కొరడా పెట్టి మొగమున
కడ్డముగా వ్రేసినట్లు మెఱసె
మాధుర్య దేవత మరణవేదన మూల్గు
గతి నేచి బావురు కప్పలరచె
అంభోదభారాసహానములై మిన్నులు
నురుములు పిడుగులై యుర్విగూలె
ప్రళయప్రథమ పరివర్తనమ్మన ధాత్రి
వారిపల్వంక విపాక మేచె
ఉదయమున సూర్యబింబము నొరపు బనులు
తా వెలలెఁ బాడిముగ్గిన తాటిపండు
అభ్రము బలాకలకు రత్నదభ్రమై ధ
రిత్రి ధనిలోక సౌఖ్యచారిత్రమయ్యె.

మృతజీవులకు బ్రజాకృతతర్పణము దయా
    ధృతిని ముక్కాల మందిచ్చువారు
తేజోమయస్వాకృతింబొల్చి ప్రాదేశ
    మాత్రదేహములతో మలగువారు
ఒక జోలి కొక్కసాంటికి బోని నిర్మత్స
    రులు పితృకర్మల రూపువారు
అలఘుదైవతలోకములవారిలో త్మాత
    లమ్మువారికి సమీపమ్మువారు
శ్రీ నిధాన పదచ్యుతి లేనివారు
మధువులోపలి స్వాదుత మరగువారు
పరమవైదికులు పితృదేవతలు కాపు
వచ్చిరిలకు మహాళయ పక్షములకు

విశ్వనాథ సత్యనారాయణ



# కళ : కళాభిజ్ఞత

"మూర్తి"

సంధ్యాసమయాల్లో వికసించిన తామరపుష్పాలతో విరాజిల్లే నిర్మల జలపూరితసరోవరాన్ని చూచినా, శరత్కాలపు రజనీసమయాల్లో సునీల విశాల వియత్పదాన్ని శరచ్చంద్రుడు ప్రకాశిస్తుంటే సుధాప్లావిత మనోహర బ్రహ్మాండాన్ని చూచినా, అనంతాకాశ పథాల్లో అమితానందంతో విహరిస్తూ, ఏ అమృతగీతాన్నో గానంచేస్తూ తమ తమ గూళ్ళకు పోయే శకుంతసంతానాన్ని చూచినా యే హృదయం రసాప్లావితం కాదు?

వస్తువిశేషాన్ని తిలకించేటప్పుడు కలిగే ఈ భావమే రసము ఈభావాన్నే, ఈ రసజ్ఞతనే కళ అని నిర్వచించవచ్చు ఈశ్వర తత్వంవలె కళనుగూడ యిదే అని నిర్వచించలేము సత్యాన్ని దేన్ని గూడా నిర్వచించుట దుస్సాధ్యము అందుకనే

"When one Art can fully be explained by another then it is a failure"

కళ యిదే అని నిరూపించడంగాని, దాని స్వరూపనిర్ణయం చేయటంగాని వ్యర్థప్రయత్నమని విఖ్యాతకవిచంద్రుడు రవీంద్రుడు నుడివియున్నాడు

"It (art) is to be felt, not to be explained"

ఇది అనుభవ యోగ్య మయిందే కాని నిరూపింప వీలులేదని వంగదేశ విఖ్యాత చిత్రకారుడు అవనీంద్రనాథ ఠాకూరు పలికినాడు ఒక కావ్యాన్ని పఠించినప్పుడుగాని, ఒక శిల్పాన్ని చూచినపుడుగాని "మీరేమి గ్రహించారు" అని ప్రశ్నిస్తే "ఏమో చెప్పలేని మహోత్కృష్ట - అవ్యక్త మాధుర్యాన్ని, ఆనందాన్ని అనుభవింప గలిగే"

మని చెప్పగలం కళయొక్క పరమావధి ఇట్టి అనిర్వచనీయమయిన రసానుభూతే అని వివిధ సంప్రదాయాల రసజ్ఞులేమి, శిల్పజ్ఞులేమి, చిత్రకారులేమి నిర్వచించారు,

"- - - the fine touch of the eye, or grace of manners or a phrase of poetry plants wings at our shoulders - - - This is that haughty force of beauty which the poets praise immeasurable and bevine."

ఏ నయనానందమనోహర ప్రకృతిచిత్రాన్ని దర్శించినప్పుడో, యే ఉత్తమకావ్యాన్నో పఠిస్తున్నప్పుడో, యే శ్రావ్యకంఠం నుంచో వెలువడే అమృతగానాలాపం శ్రుతిపుటాలకు తాకుతున్నప్పుడో, హృదయాన్ని తట్టి మార్మోగించే యే ఉత్తమశిల్పాన్నో చూస్తున్నప్పుడో హృదయం పక్కసారిగా రెక్కలు కట్టుకుని యే అగాధవాతావరణాల్లోనో సంచరిస్తున్నట్లుంటుంది ఈ గభీరరసగ్రహణశక్తినే అత్యాశ్చర్య దివ్యసౌభాగ్యమని కవులు పాడేరని ఎమర్సన్ చెప్పేను భావనాస్ఫోరకత్వము ( suggestiveness ), స్వకీయ కల్పన, రసోజ్జృంభణము, విశ్వజనీనత, హృదయాకర్షణము కలదే ఉత్తమకావ్యకళ హృదయాన్ని తట్టి, హృదయాన్ని మార్మోగించి, హృదయాన్ని పరవెత్తించి, శిల్పసౌహృద్యాన్ని పొందింపచేసేదే ఉత్తమశిల్పకళ పాత్రానుగుణ్యంగా పద్య గద్యానులంకలి రసాన్ని ముఖబింబాల్లోనో అంగవిన్యాసాల్లోనో ప్రతిబింబింపచేయడమే ఉత్తమనాట్యకళ కళోపాసకులు తమ అంతరంగికానుభావాల్ని విశ్వజనీనతను తమ కావ్యాల్లోనో, శిల్పాల్లోనో మూర్తీభవింప జేస్తారు ఉత్తమకావ్యాలేమి, శిల్పాలేమి, చిత్రాలేమి, ఆత్మానుభవ జనితాలు, ఆత్మోపభోగ్యాలు ఇవి జీవనానికావలి గట్టును స్ఫురింపచేస్తాయి సూక్ష్మంగా పరిశీలిస్తే కళాభిజ్ఞులు, ద్వివిధ మార్గాలను త్రొక్కినట్లు కనుపిస్తుంది ఒకరు తమ కళాప్రాశస్త్యానికై అనుకరణానికే ప్రాధాన్యమిచ్చేరు ఇంకొకరు భావానికి ప్రాధాన్య మిచ్చేరు. మొదటిది పాశ్చాత్యకళా సాంప్రదాయాల్లో

# శిల్పి : వరదా వేంకటరత్నముగారు

మద్దాలి సూర్యప్రకాశరావు

*'Fair things pass by unheeded as a threshold brook'*

—**Keats**

చిత్రకళ మూగకళ. చిత్రకారులు మసిపూసిన మాణిక్యములు చిత్రములు చూచినమాత్రమున సువ్యక్తములగునని భావించుట పొరపాటు ఈ కళ తత్వము అనుభవైక వేద్యమేకాని వ్రాయుటకును, చదివికాని వినికాని తెలిసికొనుటకును సాధ్యముకాదు. చిత్రకళాసౌందర్యము నాస్వాదించుటకు ఈ కళోపాసకులే సమర్థులగుచుందురు. ఈకారణముననే ఈకళ లౌకికదృష్టికి ఇంచుక దూరమైనది చిత్రకారులు సాధారణముగా వక్తలు కారు వారిలో కుంచెబట్టి కలముబట్టిన వారు చాలఅరుదు కావుననే శిల్పులు జగమెరుగని అజ్ఞాతమూర్తులు.

శ్రీయుత వేంకటరత్నంగారు స్ఫురద్రూపులు గారు. రివ్వున బోవు వారిని ఆకర్షించగల తేజమును ఆయనకు లేదు వాక్శూరులును గారు ఇక వీరిని జగమెరుగదనిన ఆశ్చర్యమేమి? ఏకాంతప్రియుడగుటచే నీయనకు మిత్రులసంఖ్యగూడ తక్కువే ఈయన ఆంధ్రచిత్రకళకు వ్యక్తిత్వమును సంపాదించిన త్రిమూర్తులలోనొకరనియు ఈయన యుత్తమచిత్రములు ఖండాంతరముల పొగడ్తగన్నవనియు చెప్పిన ఈయనమిత్రులుసైత మాశ్చర్యపడుదురు నమ్మజాలమనియనవచ్చును

కళాసృష్టి యెంతగూఢము వ్యంగ్యమునయినను శిల్పి మూర్తికి మాత్రము అది ప్రతిబింబమే అతని హృదయావేదన, భావోద్రేకము, చిత్తప్రవృత్తి అతడు వరించు వర్ణములలోను అభిమానించు రేఖల

లోను ప్రతిఫలించితీరును

ఈ సిద్ధాంతమునకు ప్రబలతార్కాణము శ్రీ వేంకటరత్నంగారు ప్రాయమునసే ఈయన విగతకళత్రుడు తిరిగి కళత్రస్వీకరణము చేయలేదు. ఉన్నతకళాశిక్షణ నొందుటకు ఇంగ్లండుపోవు నవకాశమును — లభించినదానినిగూడ వదలుకొనెను పిమ్మట క్రమేణ దేహదార్ఢ్యము సడలజొచ్చెను ఏదో అనిర్వాచ్యమైన బాధ యీయన హృదయమున స్థిరనివాస మేర్పరచుకొని ఈ శిల్పి యనంతరజీవితమును విషాదచ్ఛాయావృతము చేసివైచినది ఈయన చిత్రములలో నొక వింతయైన — అర్థముకాని — కృష్ణవర్ణము అంతర్వాహినిగా ప్రవహించుచుండును తమస్సావరించిన చిత్రములనిన ఈయనకు మిక్కిలి ప్రీతి.

సాధారణముగా బొమ్మలలోని స్త్రీ పురుషాకులకు ఆ యా సుప్రసిద్ధచిత్రకారుల ప్రాయము, దేహపుష్టి, అంగవిన్యాసముల ననుసరించి స్వరూప మేర్పడుచుండును. శిల్పుల మనఃప్రవృత్తిని బట్టికూడ ఇవి యేర్పడుటకలదు. కాని దృఢగాత్రులగు చిత్రకారుల చిత్రములలోని స్త్రీ పురుషులే శరీరపుష్టి గలిగియుండరు ఆరోగ్యవంతులును సుఖజీవులునగు శిల్పుల చిత్రములలో జీవకళ యుట్టిపడుచుండును వేంకటరత్నంగారు మిక్కిలి దుర్బలుడు నీరసుడు ఆరోగ్యభాగ్య మిసుమంతయు లేనివాడు కాని ఈ లోటును ఆయన హృదయ గాంభీర్యము, మనోదార్ఢ్యము కప్పివైచినవి కనుక యీయన చిత్రములలోని వ్యక్తులు మూర్తిమంతులేకాని నీరసులుకారు స్త్రీలు సౌకుమార్యము ఒయ్యారము కలవారు పురుషులు దృఢగాత్రులు కాక పోయినను శరీరసౌష్ఠవమునకు కొరతలేదు మితిమీరిన తెలివికి లక్షణమగు బంగాళీ వంకరలు మాత్రము వీరిలో గానబడవు చిత్రకారులు భక్తులుగూడ నై యున్నకాలమున ఈ కళకు స్వర్ణయుగము సంభవించెను. వేంకటరత్నంగారి చిత్రములు పదింట తొమ్మిది భగవత్సంబంధము లయినవి. 'శిఖరద్వయమును' 'గోపీమోహనుడు' 'ఉమాపరిణయము'

'కైలాసనాథుడు' 'నటరాజు' 'దాక్షారామ' - ఇట్టివెన్నో కలవు. వీనియందీయన కరలాఘవము, గుంపులు కూర్చుటలో నేర్పు, వర్ణవ్యత్యాసమందలిసొంపును ఘనీభవించినవి ఈయన శిల్పశాస్త్రపాండిత్యమునుగూర్చి కూర్ద్రిపండితులు తరచుగా ప్రశంసించుచుందురు శిల్పమునకు నీతికి లేశమైనను సంబంధములేదని వేంకటరత్నంగారికి బాగుగ తెలియును అయినను భక్తియే ఆయన కుంచె నడిపించుచుండును.

వేంకటరత్నంగారి చిత్రములను నాల్గుతరగతులుగ విభజింపవచ్చును.

౧ పౌరాణికములు ౨. దైవికములు

3 భావచిత్రములు ౪ సాధారణములు

ఇందు "పాయసవిభజనము" "ఉమాపరిణయము" "గంధర్వశాపవిమోచనము" మొదటితరగతిలోను, "చతుర్ముఖబ్రహ్మ" "నటరాజు" "కైలాసనాథుడు" "గౌరీశంకరులు" "సాక్షాత్కారము" రెండవతరగతిలోను "నిశాముఖి" "తపోభంగము" "ఆలోచన" "అభిసారిక" మూడవతరగతిలోను "పాలమునుంచి" "కోతకుపోవుట" "దమయంతీకిరాతులు" నాలుగవతరగతిలోను శ్రేష్ఠమైనవి

వేంకటరత్నంగారి చిత్రములలో అలంకారము అగ్రస్థానము వహించుచున్నది చిత్రపటపఠనమునందు నేర్పరులగువారు ఈ శిల్పి జన్మచే విశ్వబ్రాహ్మణుడని గ్రహింపవచ్చును పౌరాణికములు, భగవత్సంబంధములగు చిత్రములలో అలంకారమున కవకాశము మెండు ఈయన తనబలము నెరిగి, యీచిత్రములనే యెక్కుడుగా వ్రాయుచుందురు. ఆంధ్రచిత్రకారులలో ఈ కళావిశేషమున ఇప్పటికీయనకు తుల్యులు లేరు

భారతీయచిత్రచరిత్ర వ్రాయునపుడు ఆ గ్రంథకర్త "శిఖరద్వయము" "కైలాసనాథుడు" "గోదావరి స్నానఘట్టము" లను మరువకుండుగాక యని నా మనవి.

చిత్రకళాచార్యుడు కీ. శే దామెర్ల రామారావునకు వేంకటరత్నంగారు దేహమాత్రభిన్నులయిన మిత్రుడు రామారావు ప్రాక్పశ్చిమ కళలలోని సుగుణముల సంపుటీకరించుకొని "ఆంధ్ర"కళను సృష్టిచేసి దివంగతు డయ్యెను ఆంధ్రకళనుద్ధరించెదనని వేంకటరత్నంగారాయ నయెదుట బాసచేసెను ఆ ప్రతినను చెల్లించుటయే ఆయన జీవితాశయము నేడీయాశయమే "రామారాయ చిత్రకళాసంఘము" అను పేరిట రూపు దాల్చియున్నది దానికి వేంకటరత్నంగారు గౌరవాచార్యుడు. రామారాయని పేరు చిరస్థాయి నొనర్చుటయు, ఆంధ్ర చిత్రకళ నభివృద్ధిచేయుటయు నీ సంఘము ముఖ్యోద్దేశములు కళా పిపాసువులగు పలువురు ఇందు సభ్యులు వారిలో వేంకటరత్నంగారి గురుత్వమున కృషి చేసిన శ్రీమతులు దిగుమర్తి బుచ్చికృష్ణమ్మ, దామెర్ల సత్యవాణి గార్లును, శ్రీయుత వై. సుబ్బారావుగారును పేరు బడసి యున్నారు.

వేంకటరత్నముగారికి భూగోళమంతయు ఈ సంఘమే ఈ సంఘభారమువహించి ౧౦ సంవత్సరములు జయప్రదముగా నడపినారు తత్ఫలితముగా ఆంధ్రకళావృక్షము ప్రేళ్లుతన్నినది. ఇపుడీయన ఒక మందిరము నిర్మించి అందు రామారావుగారి చిత్రములను స్థాపించవలయునని సంకల్పించినారు ఈ ఉద్యమములో తన మనోవాక్కాయార్థముల కేంద్రీకరించి పనిచేయుచున్నారు రామారావు గారికొక స్మృతి చిహ్న మేర్పడిననాడు వేంకటరత్నంగారు సిద్ధసంకల్పుడే యగును

ప్రస్తుతము ప్రచారమందున్న నల్లసిరాచిత్రములు సులభసాధ్యములు స్వల్పమూల్యములు గలవి వీటిని చూచుటకే ఓపిక లేని పాఠక మహాశయులకు ఈ చిత్రముల మూలపురుషులగురించి యోచించుటకు ఓర్పుండుట అసంభవము. కాని సత్యకామికి తెలియదగిన విషయమిది. వేంకటరత్నంగారే మొదట యీచిత్రములను ఆంధ్రదేశములో ప్రవేశపెట్టి ఉన్నతస్థితికి తెచ్చిరి

ఆంధ్ర చిత్రకళకు ముఖ్యాంగములు ధాతువర్ణ తీక్ష్ణరేఖారేఖాక స్త్రీపురుషాదుల చిత్రములలో గురియైన అంగవిస్ఫూర్తి, భంగిమములోని వయ్యారము, సుళువులుకూడనున్నవి ఈ విశేషములనలవరుచుకొన్న ఇప్పటి భారతీయ చిత్రకారులను వ్రేళ్లమీద లెక్కింపవచ్చును వీరిలో రామారావుగారు మొదటివారు రెండవస్థానము వేంకటరత్నంగారిది వీరి "అజంతారాణి" "దేవదాసి" "గోదావరీస్నానఘట్టము" అను చిత్రములు వీరి కళావిశేషమునకు పేటికలు

ఆంధ్ర చిత్రకళయందు తైలవర్ణములకంత తావులేదు రామారావుగారి కళాసాధనమును కొలదిగా మాత్రమే ఉపయోగించెను వేంకటరత్నంగారు ఇప్పుడిప్పుడే ఈరంగుల నుపయోగించుచున్నారు రెండు విశాలచిత్రములు వెలువడినవి మొదటిది "గౌరీశంకరులు" ఈమధ్య నొక లలితకళాప్రదర్శనమునందు ప్రథమబహుమానమును పొందినది ఇక రెండవది "సైరంధ్రి" ఈవిషయమున ఈ శిల్పి విజయము భవిష్యత్తులో మరుగుపడియున్నది నీటిరంగులలో నున్న ప్రవీణత నూనెరంగులలో గూడ సంపాదించినయెడల వీరు సవ్యసాచియే

ముప్పదియైదేండ్లలో వేంకటరత్నంగారు శిల్పకళాపారంగతుడయినాడు ఈయన కృషి ఫలోన్ముఖమైనది వీరి భవిష్యత్కళాసృష్టి ఊర్ధ్వగామియై యుండునటుల జగత్శిల్పి వీరిని దీవించుగాక

ఆంధ్రజాతి మేఘావృతతారామండలము ఒకనాడు కూర్త్రిపంకితునుయీ మబ్బు తెరను కొంతచీల్చి తేజఃపుంజమగు రామారావుగారిని ప్రాపంచక దృష్టికందజేసెను ఈ చుక్కజతగాడింకను మరుగుపడియే యున్నాడు. అయినప్పటికిని గగనవీధి నిర్మలమగు దినములు రానున్నవి లలితకళ మరల తనగౌరవ పీఠమును అధిష్ఠింపగలదు.



# పరిచయం

నేడు తెలుగుపద్యాలు వ్రాస్తున్న కవులలో విశ్వనాథ సత్యనారాయణగారిది ప్రప్రథమశ్రేణి: మరి పరవశులు వీరికి మొదటి స్థానమే ఇస్తారు,

వర్షర్తు పద్యాలలో ఈయన భూమినీ - ఆకాశాన్నీ, తెలుగునీ - సంస్కృతాన్నీ ఒక్క లయతో కదం కొట్టించారు వీటిలో శ్రీనాథుని సీసపద్యాలను జ్ఞాపకంచేస్తూ వ్యక్తిత్వం చెడని రచన సాగింది సత్యనారాయణగారు నవకవులలో 'ప్రాచీనుడు' ఈయన పద్యాలు మహాబలిపురపు రాతి గోపురాలు.

* * *

తెలుగునాట కలంపట్టిన బోలెడుమందిలో ఒక్కొక్కడూ తానే అనన్యసామాన్యప్రజ్ఞావంతుడనీ, తనకు న్యాయంగా రావలసిన కీర్తిని ఈ చచ్చు దేశం ఇయ్యకుండా ఉందనీ భావించడం పరిపాటిగా ఉన్నది కవికొండల వేంకటరావుగారుమాత్రం "నేను వ్రాసిందేదో వ్రాశాను ఇష్టమైతే స్వీకరించండి. కష్టమైతే మానెయ్యండి" అనే మనోస్థైర్యాన్ని ప్రదర్శిస్తారు తిట్లకూ దీవనలకూ ఒకేరకం నిశ్చలత్వం వహించగల సద్గుణం వీరినుండి చాలామంది అలవరచుకోవాలి

వెంకటరావుగారు ఏ పత్రికకు ఎట్టి రచన పంపించాలో ఎరుగుదురు వీరికు ఇంత చక్కని గీతికను పంపినందుకు మేము సగర్వసంతృప్తి వహిస్తున్నాము పొగడాలంటే ఈగీతికలో చాలా ఉన్నది. కాని...

* * *

నీవు కనుక అనే గేయం అన్నివిధాలా కొడాలి రాజారావుగారి రచన. ఇందలి గుణాలూ, దోషాలూ ఇతని స్వకీయములు.

రాయప్రోలుకవి కనీసం కాలక్రమంలోనైనా మొదటివాడు కాబట్టి అతణ్ణి ముందు పేర్కొంటేనో? వ. సు రాయకవికి ఇంకు పేర్కొన్న కవులతో ఏమాత్రం సాజాత్యం ఉన్నది? మరికొందరు కవుల గూర్చి చెప్పినట్లయితే ఇంకా ఈ గీతం సమగ్రంగా ఉంటుందేమో? ఇటువంటి ప్రశ్నలు తాత్కాలికంగా విస్మరిద్దాం - ఈ గీతంలో ఉత్సాహమూ, ఋజుత్వమూ ఉన్నవి అనుకరణ లేదు. ఆర్భాటం లేదు ఇందుచేత దీనికి ప్రచురణ ఇస్తున్నాము.

# సమీక్ష

కావ్యావళి కవయిత్రి శ్రీమతి సోమరాజు ఇందుమతీదేవి ప్రసిద్ధిగన్న నవ్యాంధ్రకవయిత్రులలో ఒకర్తెగాదు ఈ శ్రీమతి కాని కవితాత్మలో ఈమె వారికెవరికీ తీసిపోదు అయితే ఆంధ్రలోకానికి ఈమె పరిచితి కిదే మొదలేమో

ఈ కావ్యావళి లో పతిభక్తి శ్రీరంగనాథస్తుతి, వేణుగోపాలశతకము అని మూడు కావ్యాలున్నవి పతిభక్తిలోని ఐదు ఊర్పులునూ స్వచ్ఛము అకుటిలము అయిన అంతరంగంతో మిలమిలా మెరుస్తూ వున్నవి పూర్ణిమారాత్రి బీచ్ మీద షికారుచేస్తుంటే ఏ అనుభవం కలుగుతుందో ఈ కావ్యం చదివితే ఆ అనుభవం కలుగుతోంది పది నిమిషాలో ఐదు పెదతరంగాలు విరుచుకుపడుతున్నవి ఎంత మనోహరంగా వుంటుంది?— ఈ హృదయం అతిగంభీరం ఈ కావ్యం అతి సుందరం రంగనాథస్తుతి ద్విపద— కవయిత్రికి చేయి తిరిగిన ఛందం కాని ద్విపద లఘుచ్ఛందం ఒకే స్వరసరళి శీఘ్రావృత్తం కావడం చేత త్వరగా విసుగుపుట్టుతుంది ద్విపద వ్రాసి నిర్వహించడం కష్టం

కావినై జవరాలి గాంత్యంతువేని
భామలక్ష్మిని దెత్తు బతిమాలి రంగ

ఇత్యాదిభావాలు మధురంగావున్నవి వేణుగోపాలశతకం సీసపద్యాలతో కూడిఉంది శతకాలకీ సీసాలకీ సంబంధం చాల పురాణమైనది శతకాలు ఏక వూపున వ్రాసేవి కాదు అప్పుడప్పుడు వ్రాసి వంద ఐనప్పుడు శతకం అంటారు కనుకనే వీటిలో పూర్వోత్తరభావవిరోధం, పునరుక్తి అనివార్యాలు దీర్ఘంగా వుండే శతకభావాలకు ఈ సీసం మంచి అనువైన ఛందస్సు ఈమె సీసాల్లో ప్రత్యేకత లేకపోయినా పేలవత్వం మాత్రం లేదు

ఈ మూడుకావ్యాలూ శిల్పప్రదర్శనానికి తావిచ్చేవి కావు ఆ విషయంలో కవయిత్రి కౌశలనిర్ణయం ఇప్పుడు కుదరదు అంతశ్శుద్ధి నిండారివుండడంచేత ఆ అంతఃకరణం విశుద్ధం కావడంచేత, శైలి మనో

హారం కావడంచేత ఈ కావ్యావళి ఉపాదేయంగా వున్నది వందపుటల గ్రంథం సుందరమైన ఆకృతి ఆకువివారి చక్కని ముఖచిత్రం కావ్యభావానురూపంగా వున్నది వెల నాలుగణాబిళ్ళలు కావాలిస్తే: యువకవిసమితి, కలువపాముల, కృష్ణా జిల్లా

"శర్మ"

కోపదారి మొగుడు గ్రంథకర్త, చేకుమళ్ల కామేశ్వరరావు అయిదంకముల సాంఘిక నాటకము ౧౩౦ పేజీలు ప్రకాశకులు, చేకుమళ్ల విశ్వనాథం రాజమండ్రి వెల నాలుగణాలు

అనేకమంది కోపదారిమొగాళ్లు తమ భార్యల్ని పెట్టే బాధలుచూసి వీటినివారణ కోశ నాటకం రాయాలని గ్రంథకర్తగారు వుద్దేశించారు కనుక ఆ వుద్దేశ్యం యెంతవరకు నెరవేరిందో చూడాలి

శంకరశాస్త్రిఅనే స్కూళ్ల యినస్పెక్టరు చాలా ముక్కోపి అయితే తన కోపం యెక్కడా చూపించడానికి అవకాశం లేనందున తిన్నగా భార్యమీదనే ప్రయోగిస్తాడు కోపం రావడాని కేమీ ప్రసక్తి లేక పోయినప్పటికీ తప్పకుండా కోపం తెచ్చుకుని భార్యకు నిత్యం ప్రహరణాలు నజరుపెట్టేవాడు ఒక్కొక్కప్పుడు ఆయన కొట్టే దెబ్బలు భరించలేక విరుచుకు పడిపోయేది ఇంట్లో అత్తగారూ, బావ కొడుకు గోపాలమూ ఆమెను ఓదార్చేవాళ్ళు కొంత కాలానికి ఆవిడ టైఫాయిడ్ ఫీవర్ వచ్చి చచ్చిపోయింది పిల్లల్ని పోషించేవాళ్లూ, తనకు తిండి పెట్టేవాళ్లూ లేకపోయేసరికి శంకరశాస్త్రికి బుద్ధి వస్తుంది

అయితే గ్రంథకర్త కథను యింతటితో వదలి వేయిలేదు చిన్న పిల్లలను తిరిగి మళ్లీ పెళ్లి చేసుకోటానికి మారుగా వీ[illegible]ంగంగారి తోటలో నున్న ముప్ఫైయేళ్ల 'సవత్స' వితంతువును పెళ్లి చేసుకొనుటతో నాటకానికి ముగింపు తెచ్చారు యింకా నాటకంలో కథకు యెట్టి వుపయోగంలేని రుచుల సిద్ధాంతిగారు, జగన్నాథం తాతగారు కథ యొక్క కళేబరాన్ని వృద్ధిచెయ్యడానికి మాత్రమే తోడ్పడ్డారు

[illegible]

గ్రంథకర్త ఉద్దేశం నెరవేరడానికి ఒకటి రెండు అంకాలు, మూడో అంకంలోని ఒకటి రెండు రంగాలు, నాలుగో అంకంలోని ఒకటి రెండు మూడు నాలుగు అయిదు రంగాలు చాలును.

మూడో అంకంలోని మూడో రంగం పూర్వకాలంలోని పెద్దవాళ్ల దెయ్యపు తిండిని గురించీ, నాలుగో అంకంలో ఆరో రంగమున్నూ, అయిదో అంకంపూర్తిగాను వితంతూద్వాహాల గురించీ వ్రాశారు. ఇందువల్లనే ఈ పుస్తకం వీరేశలింగంగారికి అంకితమిచ్చారనుకుంటా శైలి చాలవరకు నిగ్గుష్ట మయినది చదివిన కొలది చదవ వలయు ననియే అనిపించును. యీవిధంగా వాడుక భాషలో సంఘం లోని లోపములు యెత్తిచూపుటకు చిన్న నాటికలు అవసరము యీ విషయంలో కామేశ్వర రావు గారు ప్రశంసాపాత్రులు

అందరును ఆదరింపదగిన గ్రంథము వెలకూడా అందరకు అందు బాటుగనే యున్నది "రాజశ్రీ"

స్వీ కా ర ము

మహామేధావులు: కర్త, గొబ్బూరి వేంకటానంద రాఘవరావుగారు
ప్రకాశకులు, తెనుగు గుడి, ఎలమంచిలి, విశాఖపట్నం జిల్లా.
౧౨౦ పుటలు వెల రూపాయి

పద్మావతీ చరణ చారణ చక్రవర్తి: కర్త, శ్రీ శివశంకరశాస్త్రిగారు
దొరికేచోటు : కళ ఆఫీస్, పిఠాపురము
వెల : అర్థ రూపాయి

[redacted] : కర్త, కాశ్లూరి జోగారాయ దీక్షితులు.
సంస్కృతంలో వ్రాయబడ్డ రాజ్యాంగతంత్రగ్రంథం.
దొరికే చోటు: యువకవిసమితి, కలవపాముల, కృష్ణా జిల్లా.

Edited printed and published by P. Madhava Sarma
at the Usha Press, Telaprolu P.o., Kistna Dist.